# తొమ్మిదవ అధ్యాయము

## వృక్షఛేదన - కాష్ఠవిచారము

**1. వృక్ష విచారము**

**అథాఽత: శృణు విప్రేన్ద్ర దారూణాం ఛేదనే విధిమ్**
**సురదారుచన్దన శమీ మధూకతరవస్తథా** **– 1**
**బ్రాహ్మణానాం శుభా వృక్షా: సర్వకర్మసు శోభనా:**
**క్షత్రియాణాంతు ఖదిర బిల్వార్జునక శింశిపా:** **– 2**
**శాలాతూనీకసరలా నృపవేశ్మని సిద్ధిదా:**
**వైశ్యానాం ఖాదిరం సిన్ధు స్యన్దనాశ్చ శుభావహా:** **– 3**
**తిన్దు కార్జున శాశాశ్చ వైసరామ్రాశ్చ కణ్టకా:**
**యేచాన్యే క్షీరవృక్షాచ్చ తే శూద్రాణాం శుభావహా:** **– 4**

ఓ విప్రుడా ! ఇప్పుడు నీవు వృక్షములు నరికే పద్ధతిని వినుము. దేవదారు, చందనము, శమీ, మధూక (ఇప్ప) వృక్షములు బ్రాహ్మణులకు అన్ని కార్యములకు శుభము కలిగించును. ఖదిర, బిల్వ, అర్జున, శింశిపావృక్షములు క్షత్రియులకు శుభమును కలిగించును. శాల, తూనీక, సరల వృక్షములు రాజగృహములకు శుభము కలిగించును. చంద్ర, సింధు, చందన వృక్షములు వైశ్యులకు శుభమును కలిగించును. తిందుక, అర్జున, శాశ, వైసర, ఆమ్ర (మామిడి) ముళ్ళ, పాల వృక్షములు శూద్రులకు శుభమును కలిగించును.

**2. వృక్ష ఛేదన ముహూర్తము**

**ద్వ్యఙ్గ రాశి గతే సూర్యే మాఘే భాద్రపదే తథా**
**వృక్షాణాం ఛేదనం కాష్ఠసఙ్చయార్థం న కారయేత్** **– 5**
**సూర్యక్ష ద్వన్ద్వగో తర్క దిగ్విశ్వనఖ సమ్మితే**
**చన్ద్రర్క్షో దారుకాష్ఠానాం ఛేదనం శుభదాయకమ్** **– 6**

ద్విస్వభావ రాశులలో సూర్యుడున్నప్పుడు మాఘ మరియు భాద్రపద మాసములలో కఱ్ఱ కొరకు వృక్షములు నరకకూడదు. సూర్య నక్షత్రము నుండి 2,4,6,10,13,20 నక్షత్రములలో చంద్రుడున్నప్పుడు వృక్షములు నరుకుట వలన శుభము కలుగును.



3. శుభాశుభ వృక్ష విచారము

సర్వేషారుపి వర్ణానాం దారవ: కథితా: శుభా:
సురదారుచన్దన శమీశింశిపా: ఖాదిరస్తథా – 7
శాలా: శాల విస్తృతాశ్చ ప్రశస్తా: సర్వజాతిషు
ఏకజాత్యా ద్విజాత్యా వాత్రిజాత్యా వా మహీరుహా: – 8
కారయేత్సర్వగేహేషు తదూర్థ్వం నైవ కారయేత్
ఏకదారుమయా గేహా: సర్వ శల్యనివారకా: – 9
ద్విజాత్యా మధ్యమా: ప్రోక్తాస్త్రిజాత్యా అధమా: స్మృతా:
క్షీరిణం ఫలినం చైవ కణ్టకాఢ్యం చ వర్జయేత్ –10
శ్మశానేనాగ్నినా చైవ దూషితేఽ పృథవా భువా
వజ్రేణ గర్హితం చైవ వాతభగ్నం తథైవచ –11
మార్గవృక్షం పురాఛన్నం చైత్యం కల్పం చ దైవకమ్
అర్థ భగ్నార్థ దగ్ధాశ్చ అర్ధశుష్కాస్తథైవ చ –12
వ్యఙ్గా కుబ్జాశ్చ కాణాశ్చ అతిజీర్ణాస్తథైవ చ
త్రిశీర్షా బహు శీర్షాశ్చ అన్యవృక్షేణ భేదితా: –13
స్త్రీనామ్నా యే చ తరవస్తే వర్జ్యా గృహకర్మణి

అన్ని వర్ణములవారికి శుభ వృక్షములను గూర్చి తెల్పితిని. దేవదారు చందనము శమీ శింశిప (శీశము) చంద్ర, శాలములు అన్ని జాతుల వారికి శ్రేష్ఠమైనవి. ఒకటి రెండు మూడు జాతుల వృక్షములు అన్ని గృహములలో పెంచవచ్చును.మూడు కంటే అధిక జాతుల వృక్షములు గృహములో పెంచకూడదు. ఒకే జాతికి చెందిన వృక్షము యొక్క కఱ్ఱ ఉపయోగించిన అన్ని దు:ఖములను నివారించును. రెండు జాతుల వృక్షములకు చెందిన కఱ్ఱను ఉపయోగించిన మధ్యమ ఫలము. మూడు జాతుల వృక్షముల కఱ్ఱను ఉపయోగించుట అధమ మగును. పాలను ఫలముల నిచ్చు వృక్షములను ముళ్ళ వృక్షములను వదలి వేయవలెను.

శ్మశానములో అగ్ని వలన కాలిన వృక్షము, దూషిత భూమిలో ఉన్న వృక్షము, విద్యుదాఘాతమును పొందిన వృక్షము, తుఫాను వలన పడిన వృక్షము, మార్గములో పడి ఉన్న వృక్షము, కులవృక్షము, దేవస్థానములో ఉన్న వృక్షము, సగము విరిగినది, కాలినది, ఎండిపోయినది, వంకరలు తిరిగినది, పొట్టిదైన వృక్షము జీర్ణమైన వృక్షము, మూడు లేక



అనేక శిరస్సులు కలిగిన వృక్షము, ఇతర వృక్షములతో కూడిన వృక్షములు, స్త్రీ నామముతో ప్రసిద్ధము. ఈ వృక్షములు గృహనిర్మాణమునకు పనికిరావు.

**క్షీరణ: క్షీరనాశాయ ఫలిన: పుత్రనాశకా:** **-14**
**కణ్టకీ కలహం కుర్వాత్ కాకాచ్ఛత్రం ధనక్షయమ్**
**గృధ్రవృక్షం మహారోగం శ్మశానస్థం మృతి ప్రదమ్** **-15**
**వజ్రాఙ్కం వజ్రభయదం వాతదం వాతదూషితమ్**
**మార్గవృక్షే కులధ్వంసం పురచ్ఛన్న భయప్రదం** **-16**
**కుల్య వృక్షే భవేన్మృత్యుర్దేవ వృక్షే ధనక్షయమ్**
**చైత్యే గృహపతే మృత్యుర్దేవ వృక్షే భయంభవేత్** **-17**
**అర్థ భగ్నే వినాశాయ అర్థశుష్కేంధన క్షయమ్**
**వ్యఙ్గే మృతప్రజా జ్ఞేయా: కుబ్జే కుబ్జాస్తథైవ చ** **-18**
**కాణే రాజభయం విన్ద్యాదతి జీర్ణే గృహక్షయ:**
**త్రిశీర్షే గర్భపాత: స్యాద్బహుశీర్షే మృతా ప్రజా:** **-19**

పాలుగారు వృక్షములు పాలను, ఫలవృక్షములు పుత్రులను నాశనము చేయును. ముళ్ళవృక్షములు కలహమును కలిగించును. కాకులు నివసించు వృక్షముల వలన ధనహాని జరుగును.గ్రద్ధ ఉన్న వృక్షము వలన మహారోగము, శ్మశాన వృక్షము వలన మృత్యువు,విద్యుత్ వలన దెబ్బతిన్న వృక్షము వలన వజ్ర భయము కలుగును. తుఫాను వలన నష్టపోయిన వృక్షము వలన వాయు భయము, మార్గవృక్షముల భయము వలన కులనాశము, లతలతో కూడి ఉన్న వృక్షముల వలన భయము. కుల వృక్షముల వలన మృత్యువు, దేవవృక్షము వలన ధనహాని, చైత్యవృక్షము వలన మృత్యువు, సగము కలిన వృక్షము వలన వినాశము, సగము ఎండిన వృక్షము వలన ధనహాని, వంకర వృక్షమువలన సంతానానికి మృత్యువు, కుబ్జ (పొట్టి) వృక్షము వలన కుబ్జసంతానము, కాలవృక్షము వలన రాజభయము, క్షీణవృక్షము వలన గృహహాని మూడు శిరస్సులున్న వృక్షము వలన గర్భపాతము, అనేక శిరస్సులున్న వృక్షము వలన సంతాన మరణము కలుగును.

**అన్యభేదే శత్రు భయముద్యానే రవేర్భయం తథా**
**వల్లీ వృక్షే దరిద్రత్వం పుష్ప వృక్షే కులక్షయ:** **-20**



**సర్పయుక్తే సర్పభయం దేవాలయగతేక్షయ:**
**కన్యాజన్మ తు కన్యాజ్గే సచ్ఛిద్రం స్వామినో భయమ్** **–21**
**లిఙ్గే వా ప్రతిమాయాం వా తథా శక్తధ్వజేఽపి చ**
**ఆగ్నేయ పఞ్చకే చన్ద్రే విదధ్యాత్కదాచన** **–22**
**గృహే దేవాలయే వాపి పరీక్షేత ప్రయత్నత:**
**మాసదగ్ధం వారదగ్ధం తిథిదగ్ధం తథైవ చ** **–23**

ఇతర భిన్నమైన వృక్షముల వలన శత్రుభయము, లతలతో చుట్టు కొనబడిన వృక్షము వలన దరిద్రము, పుష్పవృక్షముల వలన కులనాశము, సర్ప వృక్షముల వలన సర్పభయము, దేవాలయ వృక్షము వలన స్వామినాశము కలుగును. కన్యా వృక్షము వలన కన్యా జన్మము, ఛిద్ర వృక్షము వలన స్వామినాశము కలుగును. కృత్తిక నుండి ఐదు నక్షత్రములలో (రోహిణి మృగశిర, ఆర్థ్ర, పునర్వసు) చంద్రుడున్నప్పుడు లింగము, ప్రతిమ, ఇంద్ర, ధ్వజములను కర్రతో చేయకూడదు. గృహము లేక దేవాలయములో సావధానముగా పరీక్షచేయవలెను. దగ్ధమాసములో దగ్ధ మరియు క్షయ తిథిలో కర్ర పని చేయకూడదు.

**4. వృక్ష ఛేదన రీతి**

**ఉత్పాత దూషిత మృక్షం సంక్రాన్తౌగ్రహణేషు చ**
**వైదృతౌ చ వ్యతీపాతేనవిదధ్యాత్క దాచన** **–24**

ఉత్పాతములతో కూడిన నక్షత్రములు సంక్రాంతి, గ్రహణము వైధృతీ వ్యతీపాతములలో గృహము నిర్మించరాదు.

**సౌమ్యం పునర్వసు ర్మైత్రం కరం మూలోత్తరాద్వయే**
**స్వాతౌ చ శ్రవణం చైవ వృక్షాణాం చేదనం శుభమ్** **–25**
**సమభూమిర్వనే యస్మింస్తస్మి న్వృక్షం ప్రపూజయేత్**
**గన్ధ పుష్పాది నైవేద్యం బలిం దద్యాద్విశేషత:** **–26**
**వస్త్రేణాచ్ఛాదితం కృత్వా వేష్టయేత్తన్తునా తథా**
**శ్వేత వర్ణాను వర్ణేన వర్ణానుక్త క్రమేణ చ** **–27**
**మన్త్రైరేతై ర్యథాన్యాయం ప్రార్థయేత్తం పున: పున:**
**ఆచార్య: సూత్ర ధారశ్చ రాత్రౌ సమధివాస్య చ** **–28**
**స్పృష్ట్వా వృక్షమిమం మన్త్రం భూయా ద్రాత్రే విధానవిత్**



మృగశిర పునర్వసు అనూరాధ హస్త మూల ఉత్తర ఉత్తరాషాఢ ఉత్తరాభాద్ర శ్రవణ నక్షత్రములలో వృక్షమును ఛేదించిన (నరికిన) శుభము కలుగును. సమతల భూమిలో ఉన్న వనవృక్షమునకు పూజ చేయవలెను. గంధ పుష్పముల నైవేద్యము బలిని సమర్పించవలెను. తరువాత దానిని వస్త్రముతో మూసి దారముతో చుట్టవలెను. తెలుపు వర్ణము కలిగిన దారముతో చుట్టవలెను. మంత్రముతో వృక్షమును అనేక మార్లు ప్రార్థన చేసి ఆచార్యుడు గాని లేక పనివాడుగాని ఆ రాత్రి ఆవృక్ష సమీపములో శయనించవలెను. రాత్రిలో వృక్షమును విధి పూర్వకముగా స్పర్శించి ఈ మంత్రమును ఉచ్చరించవలెను.

**యానీహ వృక్షే భూతాని తేభ్య: స్వస్తి నమోఽస్తు వ: –29**
**ఉపహారం గృహీత్వేమం క్రియతాం వా సపర్యయ:**
**ప్రార్థయిత్వా వరయతే స్వస్తి తేఽ స్తు నగోత్తమ –30**
**గృహార్థం వాఽ న్యకార్యార్థం పూజేయం ప్రతిగృహ్యతామ్**
**పదమాన్న మోదకోదనదధి పల్లోలాదిభిర్దశై: –31**
**మద్యై: కుసుమ ధూపైశ్చ గన్ధైశ్చైవ తరుం పున:**
**సురపిత్రు పిశాచ రాక్షస భుజగాసురవినాయకాశ్చ**
**గృహ్ణన్తు మత్రప్రయుక్తాం వృక్షం సంస్పృశ్య బ్రూయాత్ –32**
**యానీహభూతాని వసన్తి తాని బలిం గృహీత్వా విధివత్రప్రయుక్తమ్**
**అన్యత్ర వాసం పరికల్పయన్తు గృహ్ణన్తు తామద్య నమోఽ స్తు తేభ్య: –33**

అర్థము – **వృక్షముపై నివసించు భూతములకు శుభమగు గాక వానికి నమస్కారము. నేను సమర్పించిన ఉపహారము గ్రహింపుము. నివాసస్థానము వేరొక చోటికి మార్చుము". అని ప్రార్థించి వృక్షమును ఈవిధముగా కోరవలెను. "ఓ వృక్ష శ్రేష్ఠమా ! నీకు కల్యాణమగు గాక. గృహము మరియు అన్ని కార్యముల నిమిత్తము దీనిని స్వీకరింపుము.** పరమాన్నము, కుడుములు అన్నము పెరుగు, మాంసముతో సమర్పణ చేయించి మద్యము, పుష్పము, ధూపము, గంధము వీటితో పలుమార్లు పూజచేయవలెను. సురలు, పితరులు, పిశాచ రాక్షసులు, సర్పములు, అసురులు, వీరందరు నేను సమర్పించు పూజను స్వీకరించుగాక. ఆచార్యుడు వృక్షమును స్పర్శించి ఈ విధముగా పలుకవలెను. ఈ వృక్షముపై నివసించు ప్రాణులు విధి పూర్వకముగా నే నిచ్చు ఈ బలిని స్వీకరించి వేరే చోటులో నివసించు గాక వాటికి పలుమార్లు నమస్కారము.



వృక్షం ప్రభాతే సలిలేన సిక్త్వా మధ్వాజ్యలిప్తేన కుఠారకేణ

పూర్వోత్తరస్యాం దిశి సంనికృత్య ప్రదక్షిణం శేషమతో విదధ్యాత్ **–34**

ఛేదయేద్వర్తులాకారం పతనం చోపలక్షయేత్

ప్రాగ్దిశ: పతనం కుర్యాద్ధనధాన్యసమన్వితమ్ **–35**

ఆగ్నేయామగ్నిదాహ: స్యాద్ దక్షిణే మృత్యుమాదిశేత్

నైర్ఋత్యే కలహం కుర్యాత్పశ్చిమే పశువృద్ధిదమ్ **–36**

వాయవ్యే చౌరభీతి: స్యాదుత్తరే చ ధనాగమమ్

ఈశానే చ మహాశ్రేష్ఠం నానాశ్రేష్ఠం తథైవ చ **–37**

ప్రాత:కాల జలముతో వృక్షమును మధువుతో తడిపి నెయ్యి రాసిన గొడ్డలితో ముందు పూర్వోత్తరదిశలో ప్రదక్షిణ క్రమములో నరికి తరువాత మిగిలిన వృక్షభాగములను నరకవలెను. వృక్షమును గోళాకారములో నరికి అది పడినపుడు చూడవలెను. పూర్వదిశకు వృక్షము పడిన ధనధాన్య వృద్ధి, ఆగ్నేయములో పడిన అగ్నిభయము, దక్షిణదిశలో పడిన మృత్యుభయము, నైర్ఋతిదిశలో పడిన కలహము కలుగును. పశ్చిమ దిశలో వృక్షము పడిన పశువృద్ధి, వాయువ్య దిశలో పడిన దొంగల భయము, ఉత్తరదిశలో పడిన ధనాగమము, ఈశాన్యదిశలో పడిన అత్యంత శ్రేష్ఠఫలము కలుగును.

**పతిత వృక్ష ఫల చక్రము**

| వృక్షము పడిన దిశ | – | ఫలితము |
|---|---|---|
| ఆగ్నేయము | – | అగ్నిభయము |
| దక్షిణము | – | మృత్యువు |
| నైర్ఋతి | – | కలహము |
| పశ్చిమము | – | పశువృద్ధి |
| వాయువ్యము | – | దొంగల భయము |
| ఉత్తరము | – | ధనలాభము |
| ఈశాన్యము | – | అత్యంత శ్రేష్ఠ ఫలము |
| తూర్పు | – | ధనధాన్యవృద్ధి |



**5. వృక్ష కాష్ఠ సంబంధ విచారము**

భగ్న వా యద్ భవేత్కాష్ఠం యచ్చాన్యత్తరుమధ్యగమ్
తన్న శస్తం గృహే వర్జ్యం దోషదం కర్మ కారయేత్ –38
భగ్నకాష్ఠే హతానారీ స్వామినాయుధ సంజ్ఞకే
కర్మకర్తాఽరమన్తస్థం ధన నాశకరం మహత్ –39
ఏకభాగం మహాశ్రేష్ఠం ధనధాన్యసమృద్ధిదమ్
పుత్రదార పశుంశ్చైవ నానారత్న సమన్వితమ్ –40
ద్విభాగం సఫలం ప్రోక్తం త్రిభాగం దు:ఖదం స్మృతమ్
చతుష్షష్ఠే బన్ధనం చ పఞ్చమే మృత్యుమాదిశేత్ –41
జర్జరే ధననాశ: స్యాన్మధ్యే ఛిద్రే గదప్రదమ్
నిష్ఫలే నిష్ఫలం గేహం సఫలం ఫలమేవ చ –42
విరూపే ధననాశ: స్యాత్ సక్షతే రోగమేవ చ
హీనాఙ్గే క్షీరనాశం చ వికటే కన్య కోద్భవమ్ –43

విరిగిన లేక వేరే వృక్షముల మధ్యలో ఉన్న వృక్షము వలన గృహమునకు శుభము కలుగదు. దానిని వదలి పెట్టవలెను. విరిగిన వృక్షము వలన స్త్రీ నాశమగును. శస్త్రములతో కొట్టబడిన వృక్షము వలన స్వామి నాశనమగును. వృక్షముల యొక్క మధ్యభాగములో ఉన్న కఱ్ఱ వలన కార్మికునకు ధనమునకు హాని కలుగును. వృక్షము యొక్క ఒక భాగములో ఉన్న కఱ్ఱ వలన ధనధాన్య సమృద్ధి జరుగును. పుత్ర, స్త్రీ పశు, రత్నసమృద్ధి జరుగును. రెండు భాగముల కఱ్ఱ శుభ ఫలితము నిచ్చును. మూడు భాగముల కఱ్ఱ వలన దు:ఖము కలుగును. ఐదుభాగముల కఱ్ఱ వలన మృత్యువు కలుగును. పురాతనమైన జీర్ణమైన వృక్షము యొక్క కఱ్ఱ వలన ధనహాని విరిగిన వృక్షకాష్టము వలన రోగభయము కలుగును. నిష్ఫలవృక్ష కాష్ఠము వలన ఫలము కలగదు. కురూప వృక్ష కాష్ఠము వలన ధనహాని, నరుకబడిన వృక్షకాష్ఠము వలన రోగము కలుగును. అంగహీన వృక్ష కాష్ఠము వలన క్షీర (పాలు) నాశనము, వంకర వృక్షముల కాష్ఠము వలన కన్యకల ఉత్పత్తి జరుగును.

కాష్ఠం నో భుజ్యతే కీటైర్యదిపక్షం ధృతం జలే
కృష్ణపక్షే ఛేదనం చ నశుక్లే కారయేద్బుధ: –44



**ఉద్ధృత్య కాష్ఠం శకటైర్మనుష్యైర్వా సమన్తత:**
**వైన్యానాశే తస్య నాశ: ఆరభజ్గే బలక్షయ:** **-45**
**అర్థక్షయోఒక్ష భేదే చ తథా భజ్గే చ వర్ధకే**
**విజయాయ భవేత్శ్వేత: పీతో రోగప్రదో యత:** **-46**
**జయదశ్చిత్రరూపశ్చ రక్తై: శస్త్రాద్భయం భవేత్**
**ప్రవేశే చైవ దారూణాం బాలకాశ్చాపి తారుణా:** **-47**
**యథా వాచం కథయన్తి తత్తథైవ భవిష్యతి**
**రజ్జుచ్ఛేదే బాలపీడా యన్త్రభేదే తథైవ చ** **-48**
**ఇతి ప్రోక్తం మయా వృక్షచ్ఛేద నార్థం విధానత:**
**శకునాని పరీక్షేత దారుచ్ఛేదన కర్మణి** **-49**

కర్రను ఒక పక్షము వరకు జలములో ఉంచిన కీటకము తినకుండా ఉండును. కర్రను కృష్ణపక్షములో నరకవలెను. శుక్లపక్షములో నరకరాదు. కర్రను నాలుగు ప్రక్కల నుండి మనుష్యుల ద్వారా ఎత్తించి బండిలో పెట్టినపుడు బండి కొయ్య విరిగిన స్వామికి నాశము కలుగును. ఆర భంగము కలిగిన బలక్షయ మగును. చక్రములు విరిగిన లేక కట్టిన తాడు తెగిన ధనహాని జరుగును. తెల్లని కర్ర విజయమును పచ్చని కర్ర రోగమును కలిగించును. అనేక రంగులు కలిగిన కాష్ఠము విజయమును, రక్తవర్ణ కాష్ఠము వలన శస్త్రభయము కలుగును.

కర్రను తెచ్చే సమయములో ఎర్రని వస్త్రము ధరించిన బాలుడు ఏవిధముగా మాట్లాడునో ఆవిధమైన ఫలము కలుగును. త్రాడు మరియు యంత్రము విరిగిన బాలకులకు నష్టము కలుగును. నేను కాష్ఠము నరుకు విధానమును తెలిపితిని. ఈ పని చేయు సమయములో శకున, అపశకునముల విచారణ చేయవలెను.

**తొమ్మిదవ అధ్యాయము సమాప్తము**

